Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ ఆగస్టు నెల 15 వ తేదీ శుక్రవారం [నె 22 ర

## జపాను యెత్తులు : బ్రిటిషువారి ప్రతి యెత్తులు.

### జపానుకి జర్మను ప్రోత్సాహం.

### ఎ. బి. సి. డి. రక్షణ దిట్టపరచుట.

దూర ప్రాచ్యమునందు పరిస్థితులు చాల బిగువుగానున్నవి. జపాను పత్రికలును నాయకులను యిదివరకువలెనే ప్రగల్భాలు కొట్టుచునే యున్నారు. "ఇతర దేశాలు మమ్ము చుట్టవేయుటకు ఎంత ప్రయత్నించినను జపాను యిపుడను సరించుచున్న పద్ధతినుండి తప్పించజాలవు. తూర్పు ఆశియా యందు తన భద్రతకు లోపము కలుగు చర్యలను జపాను నిరోధింపక మానదు" అని జపాను విదేశాంగమంత్రియగు అడ్మిరలు టొయాడగారు విదేశపత్రికా విలేఖరులతో ముచ్చటించుచు నుడివెను. అదివరకు తూర్పు ఆశియాలో అన్ని దేశాల అభివృద్ధి బాధ్యతను తననెత్తిని వేసుకొని ఆదేకారణంగా చీనాపై జపాను దండెత్తెను. తరువాత ఇండో-చీనాలో ప్రవేశించుటకుగూడ తనను యితరదేశాలు చుట్టవేస్తున్నాయను భ్రమనే కారణంగా తెలిపెను. ఇపుడు థాయిలాండుపై పడదలచి యీరీతిగా జపాను విదేశాంగమంత్రి ప్రకటించుచున్నాడని అందరికి తెలుసును. "దక్షిణానకు జపాను దాడి వెడలుచున్నదని అందరనుకుంటున్న చర్య కేవలం శాంతిని కోరు చర్యయే యని నేను వేరొకసారి చెప్పుచున్నాను" అని విదేశాంగమంత్రి ప్రకటించుచు, జపాను యొక్క నిజమయిన ఉద్దేశములను యితరదేశాలు గమనింపక అన్యాయంగా నిందించుచున్నవనెను.

పసిఫికు ప్రాంతము రదూ చురుకుగనుండి తన శత్రువులకు ఒత్తిడి కలిగించమని జపాన్ని జర్మనీ ప్రోత్సాహించుచున్నదనుటకు సందేహంలేదు. పసిఫికు ఉత్తరభాగమున రష్యాపై గాని, దక్షిణమున బ్రిటను-అమెరికాలకుగాని ఒత్తిడి కలిగించిన అక్ష రాజ్యాలకు లాభకరమే. అందుకని జర్మనీ యీ చర్యలకు సహాయం చేయును. కాని రష్యాపై జపాను ఎట్టి చర్య తీసుకోలేకుండా వుంది. తగిన సమయానికై వేచియున్నది. తగవు తెచ్చిపెట్టుటకు తగు చర్యలన్ని చేస్తున్నది. వ్లాడివోస్టాకు రేవుచుట్టు మందుగనులు నాటినందుకు మాస్కో ప్రభుత్వమునకు నిరసనం తెలిపెను. ఆ రేవును పెట్రోపావ్లవస్కు రేవును కాపలా కాయుటకు యుద్ధనౌకలను పంపెదమని జపాను అధికారేతరులు ప్రకటించిరి. ఉత్తరమున మంచుకో రాష్ట్రమునందు జపాను సేనల సందడి ఎక్కువగనుంది. యుద్ధం ప్రారంభమైనాక మొదటి తొమ్మిది నెలలలో ఇటలీ చేస్తున్నట్లే యిప్పుడు జపాను చేస్తున్నది. రష్యాసేనలో కొంతభాగమునైన జర్మనీ సరిహద్దుల నుండి తప్పించి యిటు రప్పించాలని జపాను యత్నించుచున్నది. తూర్పున రష్యాపై ఏమైన యుద్ధ చర్యకు గడంగినచో కాదయ్యు, కాగితపు మేడలతో కూడుకొన్న టోకియో మున్నగు నగరములు రష్యను బాంబరు విమానాలచే ధ్వంసం చేయబడునని తెలుసుకోవలెను.

ఎక్కడా లేనిశత్రువుల ప్రమాదమునుండి ఇండో-చీనాను తప్పించు నుద్దేశంతో విషీప్రభుత్వం జపానుతో సఖ్యతబడంబడిక గావించుకొనునట్లు జర్మనీ విషీని ఒప్పించకల్గెను. అందువలన ఇండో-చీనా నౌకాదళకేంద్రములందు జపాను యుద్ధనౌకలును బాంబరు విమానాలును చేరినవి. బర్మా, సింగపూరు తూర్పు డచ్చిదీవులపై దండెత్తుటకు సిద్ధముగనున్నవి. ఇండో-చీనాలో తన ఉనికి దిట్టంచేసుకొని, యిపుడు థాయిలండుపైగూడ అట్టి అధికారమునే చెలాయించాలని జపాను ప్రయత్నించుచున్నది. ఆర్థిక సౌకర్యములు మాత్రమే యీ రెండుదేశాలనుండి కోరుచున్నానని బయటకు చెప్పుచున్నది. కాని జపాను బహుటక్కరి. ఈ రెండు దేశాలలో ప్రవేశించి వేచియుండి, రష్యా ఓడినచో తాను సైబేరియాపై బడవలెననిగాని లేదా మలయా, తూర్పు దీవులపై దాడిసలుపుటకుగాని సిద్ధమవుతున్నది. జర్మనీయే ఓడినచో, జపాను ఏమిచేయక ఊరుకొనును. విడాది యుద్ధంచేసి అలసియున్న ఇంగ్లాండు, ఫ్రాంసు గోల్పోయిన వలసరాజ్యములు తిరిగి ఫ్రాంసు కిప్పించుటయందు యిదివరకువలె శ్రద్ధవహింపదని జపాను ఆశించుచుండును. కాని హిట్లరుకి ఒకేఒక ఆదర్శంగలదు. మిత్రమండలికి ఎట్లయిన చీకాకు కలిగించుటే. జపాను గెలవాలని అతనికి ఆదుర్దా లేదు.

### రక్షణ యేర్పాటులు.

ఇంతవరకు జపాను బెదిరింపులు ఫలించినవి. థాయిలాండు యొక హెూంకాంగు బ్యాంకునకు 100 లక్షల బాహటు నాణెముల ఋణమొసంగెను. మంచుకోలో జపాను ప్రభుత్వమును గుర్తించెను. కాని థాయిలాండు పూర్తిగ లొంగిపోలేదు. తనపై దాడివచ్చినచో రక్షణయేర్పాటులన్ని సిద్ధముగనున్నవని థాయి రేడియోలో ప్రకటింపబడెను. రష్యావలె శత్రువులకు వశమయినా లాభంలేకుండా పురములు ఆస్తులన్నియు తగులబెట్టి మరీ నగరాలు ఖాళీ చేస్తూవుంటారు. థాయిదేశీయులు ప్రాణాలకు తెగించి దేశరక్షణ చేసుకొందురుగాని, స్వాతంత్ర్యం గోల్పోవరని రేడియో ద్వారా ప్రకటింపబడెను.

ఎ.బి సి డి. (అమెరికా, బ్రిటను, చీనా, డచ్చి) రక్షణ శ్రేణి చేయుచున్న కృషి థాయిలండువారికి మంచి ధైర్యం కలిగించును. జపాను బూటకమును ఆస్ట్రేలియా బయటపెట్టెను. జపాను బెదిరిస్తున్నందుననే యితరదేశాలన్ని దానికి ప్రతికూలంగా ఏకమైనాయని అస్ట్రేలియా మంత్రి సర్ ఫ్రెడరికు సైక్సుగారు స్పష్టంగా చెప్పిరి. జపానుకి యిపుడు కలిగిన దిగ్బంధమునకు జపానుచర్యలే కారణము. ఏమన, బర్మా, మలయా, తూర్పుదీవులను బెదరించుచు థాయిలాండులో జపాను సేనలు ప్రవేశించినచో బ్రిటను, అమెరికాల రాజ్యాల భద్రతకు ముప్పువచ్చునట్లుగ తాము ఎంచెదమని బ్రిటను, అమెరికాల రాయబారులిద్దరును ముందుగనే తెలిపియుండిరి. సింగపూరే ఆస్ట్రేలియాకు సరిహద్దని మేమెంచి పసిఫికుప్రాంతముల భద్రత కాపాడెదమని ఆస్ట్రేలియా ప్రధానమంత్రి మెంజిసుగారు నుడివిరి.

డచ్చి తూర్పుదీవుల ప్రభుత్వంకూడ ఎటువంటి శత్రుదాడి నైనా ఎదుర్కొనడానికి సిద్ధంగానున్నామని నైదరులండ్సు మంత్రి ప్రకటించెను. చీనా ప్రభుత్వం బర్మా రోడును రక్షించుటకు యిదివరకే సేనలను పంపెను. థాయిలాండును జపాను ఆక్రమించుటను చీనా నిరోధించినచో ఫ్రెంచి సేనలు జపానుకి సహాయంచేయాలని విషీప్రభుత్వం ఉత్తరువు చేసెను. దానిగతి యింతకువచ్చెను.

బర్మా విమానాశ్రయములందు అమెరికా, బ్రిటను విమానాలు సిద్ధముగ నున్నవి. అమెరికా నౌకాదళము హవాయి దీవియందును, నేలసైన్యము ఫిలిప్పైను దీవులందును సిద్ధంగా నుంచబడెను. బ్రిసుబేను (ఆస్ట్రేలియా రేవు) వద్దకు అమెరికా యుద్ధనావలు వచ్చియున్నవి.

అన్నింటికన్న ముఖ్యం సింగపూరులో బ్రిటిషు దూర ప్రాచ్య సేనా శిబిర మేర్పడియున్నది. ఆ ప్రాంతాలకు బ్రిటిషు నౌకాదళంకూడ వచ్చినదట. బ్రిటిషు చీనా స్టేషను నౌకాదళ ప్రధాన సేనాధిపతి అడ్మిరలు లేటనుగారు యిటీవల చెప్పినమాట నిజమయింది. అవసరం వచ్చినచో బ్రిటిషు యుద్ధనౌకలు యీ ప్రాంతం చేరగలవని అతడు తెలిపియుండెను. బ్రిటిషు దూరప్రాచ్య సర్వసేనాధిపతి ఎయిరు ఛీఫ్ మార్షలు సర్ రాబర్టు బ్రూకు పాఫెముగారు అధికారము నందున్నపుడు మలయ, బర్మా, ఆస్ట్రేలియాలందున్న బ్రిటిషు సామ్రాజ్యసేనలు ఎట్టి భీకరదాడినైన ఎదుర్కొనగలవని ఎంచవచ్చును. సింగపూరునకు క్రొత్తసేనలుకూడ అనుదినం వచ్చుచున్నవి. గత ఏడాదినుండి క్రొత్తసేన తరుచు సింగపూరు పంపబడుచున్నది. సైన్యసంఖ్యయే కాక అనుభవం ఎక్కువ గమనింపదగ్గ విషయం. సామ్రాజ్య సేనలో ఎక్కువ భాగం మలయ, బర్మాలందు చాలకాలమునుండి యుండి, ఆదేశ వాతావరణమునకు, అడవి జాగాలో యుద్ధానికి అలవాటు పడియున్నారు. బర్మా, మలయ, నైదరులండ్సు తూర్పు దీవులు, థాయిలాండు, ఇండో-చీనా యివన్నియు ఉష్ణప్రదేశపు అడవులతో నిండియుండును. ఇటువంటి అడవులలో దూరి యుద్ధంచేయడం జపాను సేనకు తెలియదు. ఇపు డిపుడే ఇండో-చీనాలో ప్రవేశించినాక నేర్చుకొంటున్నారు.

ప్రజాప్రభుత్వ రాజ్యములు శాంతి నే కోరుచు శాంతియందే విశ్వాసం కల్గియున్నప్పటికి మందుగుండు సిద్ధంగానుంచి యుద్ధానికి తయారుగా వుంటవి.

# తటస్థ దేశాల సందిగ్ధ స్థితి.

## నాజీ ప్రచారముయొక్క ముప్పు.

### ఇరాను.

ఇరాను (పెర్షియా)లో పరిస్థితులు యింకను సందిగ్ధముగనే యున్నవి. ఆ దేశంలోనికి నాజీ ప్రచారకులు రాకుండా చేసుకోడం ఆ దేశానికే మంచిదని ఇరాను ప్రభుత్వమును బ్రిటిషు మంత్రి ఈడెనుగారు హెచ్చరించి యుండిరి. జర్మనీ అట్లుగాక, ఆ దేశంలోనున్న 5,000 మంది నాజీలను బ్రిటిషువారి వొత్తిడిచే తరిమివేసినచో, తాను ఇరానుతో రాజకీయ సంబంధం తెంచివేతునని బెదరించెను. ఇరానులో నాజీల ప్రచారము జోక్యము యెక్కువగుచున్న కొలది రషియాకు భయంకలిగి, అదివరకు 1921 వ సంవత్సరం తనతో గావించుకొన్న మాస్కో ఒడంబడిక షరతులను ఇరాను ప్రభుత్వమునకు జ్ఞాపకంచేసినది. ఆ షరతులలో యిట్లు గలదు—

(1) పెర్షియా, రష్యా దేశములకుగాని, రష్యా మిత్రవర్గ దేశములకుగాని, ప్రతికూల చర్యలు చేయునట్టి విదేశీయులను గాని, వారి సంస్థలనుగాని యీ రెండు దేశములలో చేరనీయరాదు. (2) తమ ఉభయులలో యెవరికి ప్రతికూలంగా నైన ఉపయోగించదగ్గ ఆయుధసామగ్రిని తమ దేశంగుండా పోనిచ్చుటకు ఉభయులు అనుమతించరాదు. (3) రెండు దేశాలలో యెవరి సరిహద్దులకైనా ప్రమాదంగానుండు యితర దేశాల సైన్యములను యెవ్వరును తమ దేశములలో చేరనీయరాదు; తమ మిత్రవర్గ దేశములలోగూడ చేరనీయరాదు. అని ఇరాను రష్యా ప్రభుత్వములు ఒడంబడిక గావించుకొనినవి.

మూడో రాజ్యమేదైనా రష్యాపై దాడి సలుపుటకై పెర్షియాలోకి సైన్యములను పంపినచో, దానిని పెర్షియా ప్రభుత్వం వారించలేకున్నచో, రష్యా స్వంత రక్షణకై తన సైన్యములను పెర్షియాలోనికి పోనిచ్చుటకు పెర్షియా అంగీకరించెను. ప్రమాదం తొలగిపోగానే రష్యా తన సేనను ఉపసంహరించుటకు అంగీకరించెను.

ఇపుడు పెర్షియాలో జర్మనులు యెక్కువ చేరుచున్నందున యీ విషయం రష్యా జ్ఞాపకం చేసి హెచ్చరించెను. పెర్షియా స్థితి యిపుడు చాల సందిగ్ధంగానున్నది. జర్మను కుట్ర దారులను (5 వ పంక్తివారిని) చేర్చుకొన్న యితర దేశాలగతి యేమైనదో పర్షియా గుర్తించుట మంచిది. ఇరానులో జర్మనులను తరిమివేయుటే ఇండియా భద్రతకుకూడ అవసరం. దక్షిణాఫ్రికా స్వతంత్ర రాజ్యములలో నాజీల ప్రవేశంగూర్చి యెట్టి చర్య గైకొనబడెనో ఇరాను తెలుసుకొనుట మంచిది.

### దక్షిణ అమెరికా.

హిట్లరు ఆక్రమింపదలంచిన ప్రపంచ భాగంలో దక్షిణ అమెరికాగూడ చేరియుంది. "శాంతి సమయంలో మా మనుష్యులను సరిహద్దులుదాటి పంపుతాము. అతని దేశంలో నుండియే శత్రువును నాశనంచేయుటే మా యుక్తి" అని హిట్లరు 1932 వ సంవత్సరములో తెలిపియుండెను. దక్షిణాఫ్రికాలో నాజీలు చేరి అనేక కుట్రలు పన్ని తిరుగుబాటు లేవదీయుచున్నారు. తద్వారా అమెరికా సహాయం ఇంగ్లాండుకి చేరకుండా చేయదలంచిరి. దక్షిణ అమెరికా రాష్ట్రములందు అమెరికా పలుకుబడి యెక్కువగనున్నందుకు జర్మనీ యీర్ష్యచెంది, దాన్ని తగ్గించుటకు రేడియోద్వారాను సినిమాలద్వారాను చాల ప్రచారంచేయుచున్నది.

ఇటీవల జరిగిన పెరుగ్వే-ఈక్వడారు పోరాటం నాజీల ప్రోత్సాహంవల్లనే జరిగెను. బొలివియాలో జర్మను ప్రతినిధి కార్యాలయమునందు దొరికిన కాగితాలలో కొన్ని కుట్రల రహస్యాలు దొరికినందున, అతడా దేశంనుండి తరిమివేయబడెను. ఎంటిరియాను రాష్ట్రమునందుగూడ యిట్టి కుట్ర బయల్పడగ జర్మను ప్రతినిధి హెచ్చరింపబడెను. ఉరుగ్వేలోనుండిన నాజీ నౌకలు తటస్థ రాజ్యమునకు (అంటే అమెరికాకు) ఒప్పగించబడెను. పెరూ, ఉరుగ్వేలందు బయల్పడిన నాజీ కుట్రలు అణచివేయబడెను. అక్ష రాజ్యాల కనుకూలంగా పనిచేస్తున్న కంపెనీలను బహిష్కరింపుమని అమెరికా ప్రభుత్వం కోరినందున, అందు కంగీకరింప రాదని మెక్సికో ప్రభుత్వమును జర్మనీ కోరగా మెక్సికో నిరాకరించెను. నాజీలు రాకుండా చిలీ ప్రభుత్వము పోలీసును కాపలా యుంచెను. దక్షిణ అమెరికా ప్రభుత్వములు యిట్లు శ్రద్ధ వహించుచుండగ ఇరాను వూరుకొనుట భావ్యంకాదు.

## టర్కీ.

టర్కీలో గొప్ప మార్పు జరుగుచున్నది. టర్కీదగు డార్డనెల్సు జలసంధిని వశపరచుకొను ఉద్దేశం తమకు లేదని తెల్పుచు ఇంగ్లాండు, రష్యాలు సమిష్టి ప్రకటనను సోమవారంనాడు టర్కీ ప్రభుత్వమునకు అందజేసినవి. టర్కీ రాజ్యపు సరిహద్దులను గౌరవించెదమనియు యూరోపులో ఏ దేశమైనా టర్కీపై దాడివచ్చినచో రక్షించుటకు తోడ్పడెదమనిగూడ రష్యా ఇంగ్లాండులు తెలిపినవి. ఈ ప్రకటన టర్కీలోను, మిత్రమండలి దేశాలలోనుగూడ హర్షింపబడెను.

టర్కీగూడ శ్రద్ధవహించుచున్నది. ఇంగ్లాండుతో సఖ్యత గనున్నది. డార్డనల్సు, టర్కిష్ థ్రేసు దేశములు ముట్టడి స్థితిలోనున్నట్లు ప్రకటించి, రాజద్రోహము కుట్ర కేసులను పట్టి అణచివేయుచున్నది. లెనిన్‌గ్రాడు పై దాడిలో జర్మనీ అపజయం పొందినచో, ఒక్కమారుగ నల్లసముద్రం టర్కీల మీదుగ కాకసు చమురుగనులపై పడవచ్చును. థ్రేసురాష్ట్రంలో బల్గేరియా సైన్యములుచేర్చి సిద్ధంగ ఉంచబడుచున్నవి. జర్మనీ విజయం నిశ్చయమనియు, బ్రిటను అమెరికాలు జర్మను షరతులను అంగీకరించకపోయినచో ఇరాకు ఇరానులపై జర్మనీ దండెత్తుననియు టర్కీలోనున్న జర్మను ప్రతినిధి వాను పాపనుగారు టర్కీకి తెల్పుచున్నారు. అందుచే టర్కీ యుద్ధంనుండి తప్పించుకొనగోరుచో టర్కీ మధ్యవర్తి ఇంగ్లాండు జర్మనీలకు రాజీ కుదర్చవలెనని అతడు సూచిస్తున్నాడు. ఈ జర్మను మాయలో ఇంగ్లాండు పడదని టర్కీవారికి తెలియును. టర్కీపై జర్మనీ దాడిచేసినచో తన స్వాతంత్ర్యమును టర్కీ రక్షించుకోగలదనుటకు ఎట్టి సందేహంలేదు. జర్మనీ యిపుడు టర్కీపై ఒత్తిడి కలిగింపజాలకున్నది కావుననే టర్కీతో వర్తక రాయబారములను జర్మనీ నిలిపివేసింది.

# అమెరికాకు బ్రిటిషు రాణి కృతజ్ఞత.

### "కష్టములవల్ల ధైర్యం దీక్ష దృఢపడినవి."

### అమెరికా ప్రజలకు ప్రత్యేక రేడియో ఉపన్యాసం.

"కష్టాలవల్ల మాగుండెలు మరింత గట్టిపడినవి, మాదీక్ష మరింత దృఢపడినది. నష్టం ఎంత సంభవించినా, యుద్ధం ఎంత దీర్ఘకాలం జరిగినా, న్యాయం, స్వాతంత్ర్యం మానవ గౌరవము దయ ప్రపంచంలోనుండి నాశనమయిపోవు" అను గంభీరవాక్యాలతో బ్రిటిషు సామ్రాజ్యం రాణియగు ఎలిజబెతు రాణి అమెరికా ప్రజలకు ప్రత్యేకంగా రేడియో ద్వారా ఉపన్యసించెను.

"మీవలెనే మేమున్నూ శాంతి ప్రియులము. గడచిన సంవత్సరాలలో నాశనములను వ్యాపింపజేయుటకు మేము పూనుకోలేదు. ఇప్పటికిని శౌర్యమునందుగాక యితర దారుణచర్యలందు శత్రువులతో ఉజ్జీకాలేదు. ఏక కుటుంబంవలెనున్న బ్రిటిషు జాతుల భక్తి సంపదలను మాచుట్టు సేకరింప యిపుడిపుడే ప్రారంభించినాము. భగవదనుగ్రహమున యీ భక్తి సంపదలు ఆఖరుకి జయింపగలవు. ఈ మధ్యకాలంలో మా ప్రజలు చాల భారమును భరించుచున్నారు. నేను వారి మధ్య తిరుగుచున్నపుడు, వారి అచంచల విశ్వాసం నాకు ఆశ్చర్యం కలిగించుచున్నది. అనేక పట్టణాలలో వారి యిండ్లు శిథిలమై పడియున్నవి. మీరు మేముకూడ ప్రేమించు అనేక పురాతన భవనములు శిథిలములైనవి. స్త్రీలు శిశువులు హతులైరి. ఆస్పత్రులలో రోగులుగూడ కనికరింపబడలేదు. కాని యీ కష్టాలవల్ల మాగుండెలు మరింత గట్టిపడినవి. మా దీక్ష మరింత దృఢపడినది. నేను ఎక్కడికిపోయినా తేజస్వంతమగు కన్నులు, చిరునవ్వుమొగాలే కనుపిస్తున్నాయి. మా మార్గము కఠినములైననిన్నీ రాళ్లతో నిండియున్నా, అదే రాజమార్గమనిన్నీ, మేము ఒక మహాకార్యం కొరకు పోరాడుచున్నామనిన్నీ మాకు తెలుసు.

కష్టసమయంలో పరుల సహాయం వాంఛించడం మా పద్ధతికాదు. కాని అట్లు అర్థించదలచినను, మేము అడుగకముందే మీరు తక్షణం పంపియుండేవారు. అమెరికావారి ఔదార్యం యీ లంకలోనుండి పోరాడుచున్న మా అందరి హృదయములను కరగించినది. అత్యవసరకాలంలో యిండ్లులేనివారికి బట్టలులేనివారికి ఆకలిగొన్నవారికి వస్త్రాహారములిచ్చి వారికి ఉపశాంతినిచ్చిన మీ సహాయం ఎన్నటికి మరువజాలం. మా కృతజ్ఞతను తెలుపడానికి సరియైనమాటలు వచ్చుటలేదు. మాటల కందరానిది. మా కృతజ్ఞత గాఢమైనది, హృదయపూర్వకమైనదని మాత్రమే చెప్పగలను. నామాట నమ్మండి. మీరు పంపిన వస్తువులు ఎట్లు వినియోగింపబడుచున్నవో నేను చూచినట్లుగా మీరును చూస్తేనేగాని, అవి బ్రిటిషువారికెంత ఆప్యాయంగానున్నవో సరిగా మీకు తెలియజాలదు.

బ్రిటనులో స్త్రీలు యిపుడన్నిపనులు చేస్తున్నారు. ఫాక్టరీలలో యంత్రాలు త్రిప్పుచున్నారు, పొలాలలో నాగలితో దున్నుచున్నారు. ఆయుధ సామగ్రి ఎంత ముఖ్యమో ఆహారము అంత ముఖ్యము. ఈ రెంటిని సృష్టించుటయందు వారుపడే కష్టము చూపే సహనం ఆశ్చర్యం కలిగించును. వారి ధైర్యం అద్భుతం. వేలకొలది స్త్రీలు నౌకాదళంలో సైన్యంలో విమానదళంలో బరువైన లారీలను నడుపుచూ, సైపుచేయుచు అన్నిరకాల పనులను, అన్ని పరిస్థితులలో ఉత్సాహంగా ధైర్యంగా చేయుచుండుట నేను గాంచితిని. వేలకొలది నిర్భయ స్వాంతులైన స్త్రీలు రాత్రిబాంబుల భయానక దృశ్యములను నెమ్మదిగ ప్రశాంతంగా ఎదుర్కొని, ప్రజలను రక్షిస్తు వారికి ధైర్యం కలిగించుచున్నారు.

నర్సులగురించి ప్రత్యేకంగా పేర్కొనాలి. వారుచేయు సేవలు, వారి శౌర్య సాహసములు ఎన్నటికి మరుపురావు. ఆస్పత్రులపై బాంబులుపడినా తాము గాయపడినా తమగురించి చూచుకోక రోగులగురించే ఆలోచిస్తారు.

గృహజీవితం గడుపు స్త్రీలుగూడ ఎన్నో విధాల తోడ్పడుచున్నారు. మీ ప్రత్యక్ష సహాయం వారికి మరింత ప్రోత్సాహంగ ఉంటున్నది.

### అమెరికాకు కృతజ్ఞత.

బ్రిటనులోవున్న అందరితరఫున అమెరికాలోని అందరికి నేను కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాను. కాని అమెరికా స్త్రీలకు ప్రత్యేకంగా ఒకమాట చెప్పవలసియున్నది. మాకు దూరంగానుండి, అటువైపు తొలగిపోకుండా మా కష్టకాలంలో మాయెడ కనికరం చూపుచున్నారని తెలుసుకొనుటవల్ల మాకు అధికబలం కలుగుచున్నది. ఇరుగు పొరుగులవారు యిట్టి దయ కనికరములు కలిగియుండవలెనని రెండువేల సంవత్సరములనుండి బోధింపబడుచున్నది. అది మీరు అనుసరించి చూపిరి.

యుద్ధం కష్టాలు భరించడం ఎంత బాధాకరమో ఎంత ఘనమో ఎరింగిన లక్షలాది ప్రజల తరఫున నే చెప్పుచున్నాను నమ్మండి. మేము మీకు కృతజ్ఞులము. మీ త్యాగం మేము మరువం. మీరు మేము ఒకేభాష మాట్లాడేవారము, ఒకే

సాంప్రదాయాలు కలవారమేగాక, ఒకే ఆదర్శాలుకలవార మనే సానుభూతివల్ల మీరు యీ త్యాగం చూపిస్తున్నారు. నిరంకుశత్వం మాకెంత అసహ్యమో మీకూ అంత అసహ్యమే. మేము వేటికొరకైతే అమరణాంతం పోరాడెదమో ఆ సిద్ధాంతములే మీకును పూజార్హములు. మేము దేనిని రక్షించడానికి పోరాడుచున్నామో, ఆ ధర్మమే మీధర్మమని మీరు నమ్ముచున్నారు కాబట్టి ఎంత నష్టమైనా సరే, యుద్ధం ఎంత దీర్ఘంగా జరిగినా సరే న్యాయము స్వాతంత్ర్యము మానవగౌరవము దయ యీ భూమిపైనుండి నాశనము కాకూడదనే మీ గొప్ప ప్రతిజ్ఞవలన, మీరు మాపట్ల యీ ఔదార్యము చూపిస్తున్నారని నాకు తోస్తున్నది.

ఇంతకన్న ఉత్తమమైన, దయాన్వితమైన, సౌఖ్యప్రదమైన ప్రపంచ పరిస్థితులు మన బిడ్డలకు ఏర్పరచుటకు మనం చేయి కలిపి పనిచేయు సుదినం కొరకు నేను ఎదురుచూస్తున్నాను. భగవంతుడు మిమ్ముందరని ఆశీర్వదించుగాక !

# మలయా అడవులలో యుద్ధం

ఒక చిన్న అడవి ఒడ్డున ఒక సైనికదళం వేచియుండెను. సైనికులు పొగత్రాగుచు మాటలాడుకొనుచున్నారు వారు ఉక్కు టోపీలకు బదులుగ తలపాగాలు ధరించియున్నారు. వాటిపై నల్లని త్రాడు వలలు చుట్టియున్నవి. ఆవల త్రాళ్ల లో గుచ్చి ఆకులు పుల్లలు ఉన్నవి. పైన విమానాలకు వీరు సైనికులని తెలియకుండుటకు అట్లు చేసిరి కండ్లముందర ఎగురు దోమలను చప్పట్లుచరిచి చంపుచు, భరించలేని ఎండ లో, చేతిరుమాళ్లతో నుదుర్లు తుడుచుకొనుచున్నారు.

ఈ దళాధిపతి ముందు చేయవలసినపని వారికి బోధించు చుండెను. ఆ ప్రాంతములందు "శత్రువు" లున్నారని తెలి సెను, కాని ఎందరో ఎచటనున్నారో తెలియదు. ఈ దళము అడవినిదాటి అవతలవైపు రోడ్డునకు 50 నిముసాలలో పోయి కాపలా కాయవలసియున్నది. అనిచెప్పి మ్యాపు చూపెను. సుబేదారు, సెక్షను కమాండరులను పిలచి, వివ రంగా ఉత్తరువులిచ్చెను. వాచీలు సరిచేసుకొనిరి.

సైనికదళం నెమ్మదిగ జారిపోయింది మార్గదర్శి యితరు లకు దారిచూపుచున్నాడు. ముందున్నవారు పారలతో దట్టమైన అడవి డొంకలను చేదించుచుండగా తక్కినవారు వారి వెనుక ఒకడొకడుగ పోవుచున్నారు. ఆఫీసరులు వారినిగాంచుచు కొంతసేపు నిలచి, తరువాత అవతలివైపునకు మోటారులలో పోయిరి. అచట వారు చేరుసరికి అడవి డొంకలలో నుండి తలపాగాలు పైకిలేచుచుండుట గాంచిరి. ఈ సైనికదళం 18 నిముసాలలో అడవిని చేదించుకొని బయటకువచ్చెను.

భారతీయ కాల్బలము మలయాలో తరచు యిట్టి పనులు చేయుచుండును. మలయా అడవులు కాలుపెట్టలేనంత దట్టమైనవని యిదివర కెంచబడెను. ఇపుడు పెద్ద సైన్యాలు కాకున్నా, చిన్న దళములు వాటిని దాటవచ్చునని రుజువైనది. ఈవిషయం ముందుగ భారతీయసైన్యమే రుజువుచేసినది. ఇకముందు అడవులచూచి భయపడ నవసరంలేదు.

మలయా అడవులలో 300 అడుగుల ఎత్తు వృక్షాలు ఒక అంతస్తుగను, అంతకన్న చిన్న వృక్షాలు రెండో అంతస్తుగను, దిగువ డొంకలు మూడో అంతస్తుగను ఉండును. ఈ దిగువ డొంకలను చేదించి సైన్యానికి, వారి సామానులు మోసుకపోవు కంచరగాడిదెలకు దారిచేయవలెను.

అడవియుద్ధం ఆటలో మొదటిసారి హైదరాబాదు రెజిమెంటు శత్రువుగా నటించెను. హైలాండు రెజిమెంటువారిని చెండాడెను. హైదరాబాదువారు దూరంనుండి దాడివచ్చి, ఒకచోట మకాంచేసి, మరునాడు ప్రాతఃకాలం ఆదేశరక్షక దళమును ఎదిరింప వేచియుండిరి. అడవులు దాటుటయందు ఆరితేరిన ఆర్గిలు సైనికదళము అతికష్టముపై ఆ అడవులలో ప్రవేశించి, కొన్నిచోట్ల నదులుదాటి, కొన్నిచోట్ల మెణుకు బంటిబురదలో నడచి, శత్రువులున్నారనుకున్నచోటికి వచ్చుసరికి వారచట లేరు. హైదరాబాదు దళమే ఆర్గిల్సు పడిన కష్టమును మెచ్చుకొనెను రాత్రి 2 గంటలకే యెవరో వెదకుచువచ్చినట్లు హైదరాబాదువారి కెప్టను ఊహించి, అర గంట ముందే మకాం ఎత్తివేసి దళమును నడిపివేసెను.

మలయాలోనున్న భారతీయ సైన్యకులగూర్చి యిట్టి వృత్తాంతా లెన్నో వినవస్తున్నాయి. వారికీ అడవులలో సింహాలు పులులకన్న దోమలు, చీమలు, జలగలు, పాముల బాధ ఎక్కువగ నున్నది.

# జపానుపై ఆర్థిక దిగ్బంధచర్య ఫలితం.

## ఎగుమతి దిగుమతి సంఖ్యలు.

## ప్రత్తి పరిశ్రమకు దెబ్బ.

బ్రిటిషు ప్రభుత్వం అధినివేశ రాజ్యము లన్నింటిని సంప్రదించిన పిమ్మటనే జపాను ద్రవ్యమును ఘనీభవింపజేసి వ్యాపార నిర్బంధములు గావించి ఆర్థికంగా ఒత్తిడి కలిగించెను ఈ ఆర్థిక ఒత్తిడి రెండువిధములు. (1) తమ దేశంలోనున్న జపాను ఆస్తులను పోనివ్వకుండ పట్టియుంచుట. (2) అది వరకు జపానుతోగల వర్తక ఒడంబడికలన్ని రద్దుచేయుట. ఇందు మొదటిచర్య వెన్వెంటనే అమలు జరుగును. అంతర్జాతీయ వ్యాపారమునకు అవసరమగు పరపతిద్రవ్యము దొరకక జపాను వ్యాపారం నిలచిపోవును. ఇదివరకే తగ్గిపోవుచున్న జపానువ్యాపారం యింకను క్షీణించిపోవును. అమెరికా ప్రభుత్వంకూడ యిట్టి చర్యయే గైకొనెను. చీనా ఆస్తులనుగూడ ఘనీభవింపజేయాలని చీనా కోరింది. ఎందుకంటే, జపాను వశమందున్న చీనాప్రాంతములద్వారా జపాను వర్తకం సాగించి యీ దిగ్బంధం నిరుపయోగం చేస్తుందని అనుమానం. బ్రిటను అమెరికాల చర్యలు చీనా కనుకూలంగా అమలు జరిపి, జపాను వశమగు చీనాప్రాంతాల ద్వారా జపాను వ్యాపారాన్ని అరికట్టుట కుద్దేశింపబడినది.

బ్రిటను, అమెరికాల చర్యలవలన జపానుకు యేరీతిగ నష్టంకలుగునో యీ దిగువ సంఖ్యలవలన తెలియగలదు : 1938 వ సంవత్సరమునందు జపానుకి దిగుమతియైన సరకులో నూటికి 34.4 వంతు అమెరికానుండి 20.2 వంతు బ్రిటిషు సామ్రాజ్యంనుండి వచ్చెను. మొత్తం 54.6 జపానునుండి యెగుమతియైన సరకు అమెరికాకు నూటికి 15.8 వంతు, బ్రిటిషు సామ్రాజ్యమునకు 19.9 వంతు, మొత్తం 35.7 వంతుగలదు. ఆ రోజులలో జర్మనికి 6.5 వంతు జపాను సరకు చేరేది.

1939 వ సంవత్సరములో జపాను అమెరికాల వ్యాపారం తాత్కాలికంగా హెచ్చింది. కాని బ్రిటిషు దేశాలతో జపాను వ్యాపారం తగ్గిపోయింది. మన ఇనుము, ఉక్కు, రద్దు ఇనుము, నికెలు, ఫెరో అల్లాయిలు, అల్యూమినియం, రబ్బరు మున్నగునవి జపానుకి యెగుమతిచేయడం మానితిమి. ఉత్తర బోర్నియాలోమాత్రం జపానువి కొన్ని రబ్బరు తోటలు కలవు. అమెరికాగూడ అట్లే దిగుమతులు నిషేధించెను.

జపాను దిగుమతులలో వస్త్రములు (ప్రత్తి సూలువి) సగంవరకు గలవు. జపాను నట్టు దిగుమతులు 1938 వ సంవత్సరములో సుమారు 500,000,000 యన్నుల విలువయుండెను. అవన్నీ అమెరికా సంయుక్త రాష్ట్రములకే. ప్రత్తి వస్త్రములు 400,000,000 యన్నులు ముఖ్యంగా బ్రిటిషు సామ్రాజ్యమునకు దిగుమతి చేయబడును. ప్రత్తి వ్యాపారంలో వచ్చేలాభం ధాన్యం పండించు వారికి సహాయంచేయుటకు వొసంగబడును. ఇప్పుడు ఇండో-చీనాలోని బియ్యం లభించుచున్నవి గావున జపానుకు బియ్యం లేవను బాధలేదు. జపాను ప్రత్తి పరిశ్రమ అంతయు అమెరికా ఇండియాలనుండి వచ్చు ముడిప్రత్తిపై నాధారపడి యున్నది. కావున, దిగుమతులు తగ్గిపోయినచో యీ వ్యాపారం దెబ్బతినును.

బ్రిటిషు, ఇండియా, బర్మా ప్రభుత్వముల తరఫున యిప్పుడు రద్దుచేయబడిన వర్తక ఒడంబడికలు మూడు గలవు. 1911 వ సంవత్సరములోని ఇంగ్లాండు-జపాను వాణిజ్యపు ఒడంబడిక; 1934 వ సంవత్సరములోని ఇండియా-జపాను ఒడంబడిక; 1937 వ సంవత్సరములోని బర్మా-జపాను ఒడంబడిక. ఇందు మొదటిది నోటీసు యిచ్చిన యేడాదివరకు రద్దుకాదు. మిగతా రెండింటికి ఆరు మాసాల వ్యవధి చాలును. 1911 వ సం॥పు ఒడంబడికవలన రెండు దేశాల ప్రజలకు నివాస అర్హతలు, వర్తక సౌకర్యములు ఒకరి నౌకలు యింకొకరి రేవులందు విడియుటకు అవకాశంగలవు. రెండు దేశాలకు సరిసమానత్వం అంగీకరించబడెను. ఒక తరం క్రిందట ఇంగ్లాండు జపానులు సఖ్యతగనున్నపుడు యీ ఒడంబడిక గావించబడెను. ఇప్పుడది రద్దుచేయుటవలన ఆ విశ్వాసం పోయిందన్నమాట. బ్రిటిషువారికి అమెరికాకు ప్రాణప్రదమగు నౌకామార్గాలకు ఆకారణంగా జపాను నిరోధం కలిగించుచుండుటచే, యీ ఒడంబడిక నిలచియుండుటకు ఎట్టి నైతిక కారణం అగుపడదు.

పడమటి యెడారికి పోవుచున్న బ్రిటిషు ఇండియా సైనికులు.



ఇండియాదేశపు రైఫుల్ రెజిమెంటు తాలూకు బ్రెన్ గన్ కారియర్ ప్లెటూనుకు చెందిన సైనికులు ఓడ దిగుట యిందు కానవగును. వీరు పడమటి ఎడారికి పోవుచున్నారు. బ్రిటిషువారు యీ యెడారియందు ఇటలీవారితో పోరాడి అనేక చోట్ల గెలుపొందిరి.

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమానదాడులు.

5 వ తేది మంగళవారం రాత్రి జర్మనీ యందంతటను పెద్ద గాలివాన చెలరేగెను. అయినను వాని నేమాత్రము లక్ష్యపెట్టక పెద్ద బ్రిటిషు విమానదళము జర్మనీపై దాడి సలిపి మాన్‌హీం, ఫ్రాంకుఫర్టు, కొబ్లెన్సూ మొదలగు పట్టణముల యందలి యంత్రాలయములపై వేలకొలది ప్రేలుడు బాంబులను వర్షించి అపారమగు నష్టము గల్గించెను.

6 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు మరల మాన్‌హీం, ఫ్రాంకుఫర్టు పట్టణములపై దాడుల సాగించి క్రొత్తరకపు పెద్ద ప్రేలుడు బాంబులను వేలకొలది వర్షించెను. 8 వ తేది రాత్రి జర్మనీ యందలి ప్రధాన ఆయుధ నిర్మాణశాలలగు క్రప్పు ఫాక్టరీలపైనను, డార్టుమండు, హామ్ మొదలగు పట్టణములలోని ఫ్యాక్టరీలపైనను దాడి సల్పి వేలకొలది బాంబుల వేసెను. బుధవారమునాడు 8, గురువారమునాడు 8 విమానములు ఈ దాడులనుండి తిరిగి రాలేదు.

8 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు జర్మనీలో పశ్చిమ వాయువ్య ప్రాంతముల పట్టణములపైన అందు ముఖ్యముగ జర్మను నౌకా కేంద్రమగు కీలు రేవుపైన భయంకరమగు దాడి సాగించెను. అచట బ్రహ్మాండమగు మంటలులేచి రాత్రంతయు నగరము మండుచునే యుండెను. యీ దాడినుండి నాల్గు విమానములు తిరిగి రాలేదు. శనివారముదయము ఫ్రాన్సులో ఆక్రమిత ప్రాంతము పై పెద్ద దాడిని సాగించెను.

అచట ఆకాశమున జరిగిన పోరాటమున 10 శత్రు విమానములు ధ్వంస మొనర్పబడెను. 5 బ్రిటిషు విమానములు తిరిగి రాలేదు. 11 వ తేది రాత్రి రష్యను విమానములు బర్లినుపై బాంబులు వర్షించెను. బ్రిటిషు విమానములు జర్మనీ పడమటి భాగమునగల ఎడెక్‌స్లీక్ అను ఇనుము పరిశ్రమలకు ప్రధానమగు పట్టణమును తీవ్రమగు దాడికి గురిచేసెను. 12 వ తేది పగలు అనేకవందల విమానములు కలోన్ మొదలగు జర్మనీయందలి పారిశ్రామిక పట్టణములపై బ్రహ్మాండమగు దాడి జరిపి వేలకొలది బాంబులవర్షించెను. ఈ దాడిలో 20 బ్రిటిషు విమానములు మరలి రాలేదు.

ఈ నెల 5 వ తేది మంగళవారమునాడు బ్రిటిషు తూర్పు తీరపు పట్టణములమీద, చాల స్వల్పముగ మాత్రమే శత్రు విమానదాడులు జరిగెను. కొన్ని ప్రదేశములలో ఆస్తికి అల్పమగు నష్టము కలిగెను. ప్రాణనష్టము అత్యల్పము.

6 వ తేది రాత్రిగూడ, ఇంగ్లండు తూర్పు, ఆగ్నేయ తీరపు పట్టణముల పై స్వల్పముగనే బాంబులు పడెను. కాని 7 వ తేది రాత్రి, ఈ దాడులు—మరీ అంత తీవ్రముగా దు కాని—ఇదివరకు కంటె చాల హెచ్చింపబడెను. తూర్పు ఆంగ్లియానుండి, బ్రిటను ఈశాన్య తీరపు పట్టణములవరకును చాల పట్టణములపైన విస్తారముగ బాంబుల వర్షించి ఆస్తికి నష్టము గలిగించిరి. కొంత జన నష్టముగూడ కలిగెను.

8 వ తేది శుక్రవారం రాత్రి కొన్ని శత్రు విమానములు బ్రిటిషు తీరపు పట్టణముల జొచ్చుకొనివచ్చి కొన్ని ప్రదేశముల పై బాంబులు వేసెను. కాని నష్టమేదియును లేదు. సోమవారమునాడు శత్రువిమానాలు అసలే లేవు.

జూలై మాసమున బ్రిటిషు విమానములు జర్మనీపై 70 విమాన దాడులను, ఫ్రాన్సునందలి శత్రు ఆక్రమిత ప్రాంతముమీద 76 దాడులను, మధ్యప్రాచ్యమున శత్రు ప్రదేశములపై 126 దాడులను సాగించెను. ఈ దాడులలో 410 శత్రు విమానములు ధ్వంసము చేయబడెను. 285 బ్రిటిషు విమానములు నష్టమయ్యెను.

## ఇటలీ—ఆఫ్రికా—మధ్యధరా.

ముసులోనీయొక్క చిన్న కుమారుడగు బ్రూనో ముసులోనీ, పరీక్షార్థము, ఒక క్రొత్త విమానమును నడుపుచుండగా, ప్రమాదముచే విమానము విరిగి ధ్వంసమై పోయెను. బ్రూనోయును, మరికొందరు వైమానిక శాఖోద్యోగులును, ఆ ప్రమాదమున హతులైరి.

ఉత్తర ఆఫ్రికా (లిబియా) రంగమున టోబ్రూకునందలి బ్రిటిషు సైనికులు 5 వ తేది రాత్రి తిరిగి, ఆకస్మికముగ దుర్గమును ముట్టడించియున్న శత్రుసైనిక పంక్తుల పైనబడి, కొందరిని హతమార్చి, చాలమందిని ఖైదీలుగా పట్టుకొనివచ్చిరి.

9 వ తేది రాత్రి ఇటాలియనుల గస్తీ పటాల మొకటి టోబ్రూకు దుర్గముపై దాడి సాగించెను కాని బ్రిటిషు మర ఫిరంగులతో నా పటాలమును నిర్మూలమొనర్చిరి.

7 వ తేదిన చాల బ్రిటిషు విమానములు ఇటాలియనుల సిసిలీద్వీపముపైకి జని గెర్బినీవద్దనున్న విమానాశ్రయములపై బాంబులవేసి, క్రిందనున్న విమానముల ధ్వంస మొనర్చెను.

మాల్టా దీవిపై 7 వ తేదిన మూడు శత్రు విమానములు దాడివచ్చెను. వానిలో నొకటి పడగొట్టబడెను. మిగిలినవి బాంబుల వదలకయే వెనుక దిరిగి పారిపోయెను.

బ్రిటిషు విమానములు లిబియాలోని బెంఘాజీ డెర్నా మొదలగు శత్రు రేవు పట్టణములపై బాంబుల వర్షించి రేవులో నున్న సప్లై నౌకల ధ్వంస మొనర్చెను.

8 వ తేదిన జర్మను విమానములు ఈజిప్టులో అలెగ్జాండ్రియా పట్టణముపై దాడులు సాగించెను. 13 మంది మరణించిరి. 23 మంది క్షతగాత్రులైరి. ఆస్తికి కొంత నష్టము కలిగెను. 11 వ తేదిన మరల అలెగ్జాండ్రియాపైనను, సూయజుకాలువపైనను శత్రు విమానములు బాంబులు వేసెను.

సిరియా యందలి హైఫా రేవుపై, జర్మనులు విమానములు 6 వ తేది రాత్రి మొదటి సారి దాడి జరిపెను. కాని యే విధమగు నష్టములును కలుగలేదు.

## అమెరికా-అట్లాంటిక్.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వాధికారులు పైకి ప్రకటింపకయే ఆక్సిను రాజ్యములపై ఒక్కటొకటిగా యుద్ధ చర్యలకు దిగుచున్నారని, రిపబ్లికను పక్షనాయకులు 5 వ తేది నొక ప్రకటనను గావించిరి.

గత వారమున నౌకా విహారమునకు అను పేరుతో బయలుదేరిన రూజ్వెల్టు అధ్యక్షుడును, బ్రిటిషు ప్రధాని చర్చిలును, కెనడా ప్రాంతమున రహస్యముగ కలిసికొని సమాలోచనల సల్పిరని, సంయుక్త రాష్ట్రములందును, బ్రిటనునందును బలమగు వదంతులు బయలుదేరెను. సంయుక్త రాష్ట్ర సైనిక నౌకా యుద్ధ శాఖాధికారులుగూడ రూజ్వెల్టు వెంట నేయుండిరి.

టోకియోయందలి సంయుక్త రాష్ట్ర రాయబారియగు జోసెఫ్ గ్రూగారు 7 వ తేదిన జపాను విదేశాంగ మంత్రిని కలుసుకొని, జపాను ఇండో-చైనాను దాటి ఇంకను ఆక్రమించ ప్రయత్నించినయెడల, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమే మాత్రము సహింపదని హెచ్చరించిరి.

రష్యా, చైనా, తూర్పు ఇండియా (డచ్చి) దీవులకు పంపుటకుగాను సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారు కెనడా యందొక ఫాక్టరీనుండి 500 విమానములను కొనిరి.

సంయుక్త రాష్ట్ర అధికారులు తమ దేశమున జప్తు జేయబడియున్న అనేకకోట్ల డాలరుల రష్యను సొమ్మును విడుదల చేసిరి. రష్యాకు చాల ఆయుధ సామగ్రి అపుడే రవాణా చేయబడెను.

అమెరికా సంయుక్త రాష్ట్రములలో ప్రతి పౌరుడును ఇదివరకువలె ఒక వత్సరముగాక, మరి 18 మాసములు సైనిక సేవ యొనర్పవలెనను చట్టము 12 వ తేదిన సంయుక్త రాష్ట్రము ప్రజాప్రతినిధి సభలో ఆమోదింపబడెను. సభ్యులలో 203 మంది చట్టమునకు అనుకూలముగను 201 మంది ప్రతికూలముగను వోటు చేసిరి.

సంయుక్త రాష్ట్ర ఫాక్టరీ లలో కార్మికుల సమ్మెలసంఖ్య హెచ్చిపోవుచుండుటచే యుద్ధసామగ్రి ఉత్పత్తికి భంగము కలుగుచున్నదని యుద్ధశాఖవారు ఆందోళనపడుచున్నారు. సమ్మె కార్మికుల సంఖ్య ఈ వారము 14,000 నుండి 23,400 లకు హెచ్చెను.

సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము 30 రోజులలో యుద్ధమున ప్రవేశించిన నేతప్ప బ్రిటను జర్మనీతో సంధి చేసుకొనువని బీవరు బ్రూకు ప్రభువు సంయుక్త రాష్ట్ర అధికారులకు తెలియ జేసెనను వదంతులు అబద్ధములని కార్డెలు హల్లుగారు ఖండించిరి.

## రష్యా.

రష్యా యుద్ధక్రమమునుగురించి జర్మను సైనికాధికారులు గావించిన ప్రకటనలో రష్యను సైన్యములకు చాల నష్టము కలిగెనని దెలిపిరి. కాని ఇంతవరకు 8,95,000 రష్యను సైనికులు ఖైదీలుగ పట్టుకొనబడిరనియు, 13,145 సాయుధసకవచ మోటారుబండ్లును, 10,?88 ఫిరంగులు, 9, 82 విమానములు నష్టమైనవనియు ప్రకటించిరి. 5 వ తేదిన స్మొలెన్‌స్కును పూర్తిగ ఆక్రమించితిమని జర్మనులు మరల ప్రకటించిరి. మూడు ప్రాంతములలో జర్మను సైన్యములు రష్యను సైనిక ప్రాకారము భేదించితిమనిరి. ఇవి

అసత్యమనియు, తాము 6,00.000 సైనికులను, 5,000 టాంకులను, 7,000 ఫిరంగులను గోల్పోతిమనియు జర్మనులు 15 లక్షల సైనికులను, 6,000 టాంకులను, 8,000 ఫిరంగులను గోల్పోయిరనియు రష్యనులు ప్రకటించిరి. యుక్రేనియాలో 7 వ తేదీన ముగిసిన పోరాటమున 6, 12, 18 వ రష్యను సైనికదళములను శిథిలమొనర్చితిమనియు ఆ దళముల సేనానులను 102 వేల సైనికులతోడ ఖైదీలుగ పట్టుకొంటిమనియు, 300 టాంకులుగూడ చేజిక్కెననియు జర్మనులు ప్రకటించిరి. ఫిన్లండు సింధు శాఖయందు రష్యనులు మరి రెండు ఫిన్నిషు దీవులను ఆక్రమించుకొనగల్గిరి.

1939 వ సంవత్సరములో లక్ష పోలండు సైనికులతోబాటు రష్యా ప్రభుత్వము ఖైదుచేసిన ఆండర్సు సేనానిని రష్యను అధికారులిపుడు వదలి రష్యను రంగమున జర్మనులపై పోరాడుచున్న పోలిషు సైన్యములకు సేనానిగ నొనర్చిరి.

8 వ తేదీన రష్యను విమానములు, జర్మని రాజధానియగు బర్లిను నగరముపైకిజని చాల బాంబులువేసెను. రష్యనులు బర్లినుపై దాడిజరుపుట కిదియే ప్రథమము. జర్మనులు ప్రతిదినమును రష్యా రాజధానియగు మాస్కో నగరముపై దాడి సలుపుచుండుటచే దానికి ప్రతీకారముగ బర్లినుపైన దాడి సాగింపబడెను.

యుక్రేనియా ప్రాంతములో రైల్వే జంక్షనగు క్రోస్టక్ పట్టణమును తమ సైన్యము లాక్రమించినవనియు 9 వ తేదీన జర్మనులు ప్రకటించిరి. ఈ ప్రాంతమున జర్మను సైన్యములు నీపరు నది పడమటి తీరముమీదుగా క్రిందికివచ్చి ఒడెస్సా ప్రాంతమును చుట్టుముట్టుటకు ప్రయత్నించుచున్నారనియు దానిని తప్పించుకొనుటకుగాను ఆ ప్రాంతపు రష్యనులు ఖాళీచేసి నీపరు తూర్పు తీరమునకు తమ సైన్యముల మరలించుకొనుచుండిరనియు వార్తలు తెలుపుచున్నవి.

స్మాలెన్స్కును తాము ఆక్రమించిన వార్త నిజమని రుజువుచేయుటకు జర్మను సైనికాధికారులు, విదేశీయ వార్తాపత్రికా ప్రతినిధులను ఆ నగరమునకు తీసుకొనిపోయి చూపుచున్నారు. నగరమంతయు స్మశానవాటికవలె నిర్మూలమై పోయియున్నది.

రష్యా యుద్ధము ముగియుటకు చాలకాలము పట్టునని ఇటాలియనులు తలంచుచున్నారు. మహా సంగ్రామము 10 సంవత్సరములవరకుగూడ సాగవచ్చునని కొందరనుచున్నారు.

రష్యా-చైనాతో సైనిక యొడంబడిక గావించుకొని జపానుపై యుద్ధమును సాగించుటకు నిశ్చయించుకొనెననువార్త పూర్తిగ అసత్యమని సోవియటు అధికారులు ప్రకటించిరి.

## విషీ.

ఆఫ్రికాయందలి ఫ్రెంచిరేవు పట్టణములను జర్మనుల కొసగుచో, విషీ ప్రభుత్వముయెడల అమెరికా సంయుక్తరాష్ట్రములు తమ వైఖరిని మార్చుకొనవలసియుండునని సంయుక్తరాష్ట్ర విదేశీయాంగ సహాయకార్యదర్శి పంపిన హెచ్చరికకు విషీ ప్రభుత్వము 5 వ తేదీన జవాబొసగెను. ఇది తమకేమాత్రమును సంతృప్తిని కలిగింపలేదని, సంయుక్తరాష్ట్ర దేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు 7 వ తేదీన ప్రకటించెను. ఆఫ్రికా రేవుల తమ స్వాధీన మొనర్పవలెనని జర్మనులు తెలపిన కోర్కెలను విషీ ప్రభుత్వము నిరాకరించెననియు, ఆ విషయమై జర్మను అధికారులతో మాటలాడుటకు అడ్మిరల్ డార్లన్‌గారు పారిస్‌నకు వెళ్లెననియు, రష్యావార్త సంఘము వెల్లడించినది. డార్లను సేనాని శుక్రవారము రాత్రి విషీకి తిరిగివచ్చెను. ఆనాడే, ఆఫ్రికాలో ఫ్రెంచి సర్వాధికారియగు వేగాండ్ సేనానిగూడ విషీకి వచ్చెను.

9 వ తేదీన మంత్రివర్గము సమావేశమై ఫ్రెంచి సామ్రాజ్య రక్షణ సన్నాహములగురించియు, ప్రభుత్వ నిర్మాణమున మార్పులగురించియు చర్చించెను. ఆఫ్రికానుండి వచ్చిన వేగాండ్ సేనానిగూడ ఈ చర్చలలో పాల్గొనెను. 11 వ తేదీకి చర్చలు ముగిసినవి. వేగాండ్ సేనాని ఆఫ్రికాకు వెడలిపోయెను. 12 వ తేదీన పెటెయిన్ సేనాని మంత్రివర్గమున మార్పులను ప్రకటించెను. వాని ప్రకారము డార్లన్ సేనాని ఉప ప్రధాని పదవితోబాటు ఫ్రెంచి సామ్రాజ్య రక్షణ మంత్రిపదవినిగూడ నిర్వహించును. సైనిక, నౌకా, విమానశాఖలు ఇతని క్రిందనే ఇక పని చేయవలెను.

మార్షలు పెటెయిను 13 వ తేదీన మంత్రివర్గ నిర్ణయమును ప్రకటించుచు ప్రజలందరు ప్రభుత్వము నన్నివిధముల బలపరుపవలెనని విజ్ఞప్తిచేసిరి. దేశమునందలి రాజకీయ పక్షములన్నియు రద్దుచేయబడినటులగూడ ఆ సమయముననే ప్రకటించెను.

సిరియాలో యుద్ధమున ఖైదీలుగా పట్టుకొనబడిన 65 మంది బ్రిటిషు, ఇండియను సైనికాధికారులను యుద్ధవిరామ యొడంబడిక ప్రకారము విడుదల చేయవలసియున్నది. విషీ అధికారులటుల విడుదల చేయలేదు. దీనికి ప్రతీకారముగ బ్రిటిషు అధికారులు సిరియాలోని ఫ్రెంచి హైకమిషనరగు డెంట్సు సేనానిని మరి 35 గురు ఫ్రెంచి అధికారులను నిర్బంధమునందుంచిరి.

సిరియాలో విషీ ప్రభుత్వము తరపున పోరాడిన ఫ్రెంచి సైనికులలో 2,000 మంది స్వతంత్ర ఫ్రెంచి సైనిక పటాలములలో చేరిరి.

## ఆక్రమిత ప్రాంతములు.

పోలండు, యుగోస్లావియా, జెకోస్లావియా యందలి స్లావుజాతి ప్రజలు జర్మనులపై తిరుగుబాటుచేయుచు, జర్మను ఆక్రమణ సైన్యములను చీకాకు పరచుచున్నారు. బెల్గ్రేడులో జరిగిన తిరుగుబాటులో ప్రజలు 250 జర్మను సైనికులను, అధికారులను చంపిరి. 180 గుర్రముల లాగుకొనిపోయిరి. జెకోస్లావేకియాలో స్కోడా ఆయుధకర్మాగారములలో పెద్ద ఆయుధముల గిడ్డంగిని ప్రేల్చివేసిరి. 14 రైల్వే ప్రమాదములు కల్గింపబడెను. ఒక ప్రమాదమున 250 జర్మను సైనికాధికారులు హతులైరి.

బ్రిటను నార్వేపైకి సైన్యమునంపి దాడి సాగించునని అమెరికాలో వదంతులుగ నున్నవి. అందుచే నార్వేలో జర్మనులు తీరప్రాంతముల ఖాళీచేసి శత్రుదాడి నివారణకు సన్నాహము లొనర్చుచున్నారు.

యుగోస్లావియాలో ప్రజలు బహిరంగముగ సైనికాధికారులపై తిరుగబాటు సాగించుచున్నారని రష్యా వార్తాసంఘము ప్రకటించెను. క్రాజినా, కోర్టక్, విశా ప్రాంతములలో ఉభయపక్షములకు తీవ్రమగు పోరాటములు సాగుచున్నటుల జెరూసలమునకు వచ్చిన వార్తలుగూడ ధృవపరచుచున్నవి.

జెకోస్లావేకియాలో ప్రజలు ఆహార పదార్థములు లభింపక చాల అవస్థలు పడుచున్నారు.

## దూర ప్రాచ్యం.

బ్రిటిషు విదేశాంగ మంత్రియగు ఈడెనుగారు కామన్సు సభలో ప్రసంగించుచు, థాయి దేశముపై నెవరైన దండయాత్రను సాగించినయెడల, సింగపూరునకు ప్రమాదకరమనియు, అందుచే దానిని బ్రిటను శత్రుచర్యగ పరిగణించుననియు హెచ్చరించెను. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ దేశీయాంగ కార్యదర్శియగు కార్డెలు హల్లుగారు—థాయి దేశముపై జపాను దాడి సాగించునెడల—అది అమెరికా హక్కులకు ఉపద్రవకరముగ పరిగణింపబడుననియు, దాని నివారించుటకు సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమువారెట్టి చర్యలకైన దిగెదరనియు

హెచ్చరించిరి. థాయిలాండు ప్రభుత్వము మంచుకో ప్రభుత్వమును అంగీకరించినటుల 7 వ తేదీన ప్రకటించెను.

జపానుపై యుద్ధమున చైనాతో కలసి పనిచేయుటకు రష్యా ప్రభుత్వము చైనా ప్రభుత్వముతో ఒడంబడిక గావించుకొనెనను వదంతి పూర్తిగ అబద్ధమని సోవియటు విదేశాంగ సహాయ మంత్రియగు లోజోవిస్కీగారు ప్రకటించిరి.

దూరప్రాచ్యమున మంచూకో సరిహద్దులలో రష్యా సైన్యములకును జపాను సైన్యములకును పోరాటము జరిగెనను వదంతి పూర్తిగ అసత్యమని రష్యను అధికారులు ప్రకటించిరి. రష్యా తూర్పు తీరపు రేవులను సంయుక్త రాష్ట్రములకు కవ్వులు కోసగరాదనియు, మంచుకో సరిహద్దులనుండి సైన్యముల తొలగింపవలెననియు జపాను రష్యా ప్రభుత్వమునకు షరతుల నంపెనని ఇటలీనుండి బయలుదేరిన వదంతులు కేవలము అభూతకల్పనలని జపాను అధికారులు ఖండించిరి

థాయి దేశమునకు బ్రిటనుతోనూ, జపానుతోనూగూడ శత్రుత్వములేదనియు, కాని ఎవరు దండెత్తివచ్చినను థాయి ప్రజలు, తుదివరకు పోరాడి నిరోధించెదరనియు, ఇతరుల సహాయము తమ కెంత మాత్రమును అక్కరలేదనియు, థాయి ప్రధాన మంత్రి రేడియో ద్వారా ప్రకటించెను.

బ్రిటిషు నౌకాదళములో చాలభాగము అపుడే సింగపూరునకు వెళ్లెననియు, చైనీయులుగూడ ఇండో-చైనా ఉత్తర సరిహద్దులలో సైన్యములను కేంద్రీకరించుచుండిరనియు వార్తలు దెలుపుచున్నవి.

జపాను తన దురాక్రమణల విధానమును వదలుకొనదలచినదియు లేనిదియు దెలుపవలెనని సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమును, బ్రిటిషు ప్రభుత్వమును జపాను ప్రభుత్వమునకు జాబునంపి, అందు సూచింపబడిన వ్యవధిలోగా సమాధాన మొసగగోరెనను వదంతులు అసత్యమని బ్రిటిషు అధికారులు ప్రకటించిరి.

ముందు జాగ్రత్తకొరకుగాను షాంగుహైలోని అమెరికా, రష్యా మొదలగు విదేశీయ సైన్యములన్నియు సమీకరించి సిద్ధముగ నుంచబడెను.

చైనాలో ఇచాంగ్ ప్రాంతమున జరిగిన పోరాటమున జపాను సైన్యములు నిర్మూలింపబడెనని చైనా అధికారులు ప్రకటించిరి.

9 వ తేదీన, జపాను విమానములు, చైనా రాజధానియగు చుంకింగు పట్టణముపై 5 మారులు భయంకరమగు దాడుల సాగించెను.

దూరప్రాచ్యమున జపానుకు, రష్యాకు ప్రస్తుతము యుద్ధము అసంభవమని, జపాను విదేశాంగ శాఖాధికారి దెలిపెను.

దూరప్రాచ్య పరిస్థితులు కడు విషమముగుచుండుటచే ఆస్ట్రేలియా ప్రధానమంత్రి మెంజీస్ తన పర్యటనమును రద్దుచేసుకొని రాజధానియందే యుండెను. దూరప్రాచ్యమున యుద్ధమువచ్చిచో యెదుర్కొనుటకు ఆస్ట్రేలియా సర్వసిద్ధముగ నున్నదని ఆస్ట్రేలియా కార్మిక నాయకుడగు కర్టినుగారు జపానును హెచ్చరించిరి. ఫెడరలు పార్లమెంటును 20 వ తేదీకి సమావేశపరచుటకు ఉత్తర్వులు గావింపబడెను.

ఇండో-చైనానుండి ఏ సరకును యెగుమతి చేయవద్దని అధికారులు 13 వ తేదీని నిషేధమును ప్రకటించిరి. ఇండో-చైనాలో 180 వేల జపాను సైన్యము దిగెననియు, అది థాయి సరిహద్దుకు సమీప ప్రాంతములలోనున్నదనియు వదంతులు గలవు.

నౌకానష్టములు.

5 వ తేదీన బ్రిటిషుకోస్తా విమానములు, ఉత్తర సముద్రమున ప్రయాణ మొనర్చుచున్న జర్మను నౌకల నెదిర్చెను. 4 నౌకలకు సూటైన బాంబు దెబ్బలు తగిలెను. 7 వ తేది పగలు కొన్ని జర్మను వర్తక నౌకలు యుద్ధనౌకల సహాయముతో ప్రయాణ మొనర్చుచుండగా బ్రిటిషు విమానములు కనిపెట్టి వెళ్ళి, వాని నెదిర్చెను. వానిలో ఒక నౌక, బాంబు దెబ్బలచే మునిగిపోయెను. ఆరోజున, మధ్యధరా ప్రాంతమున, యుద్ధ నౌకల సహాయముతో ప్రయాణ మొనర్చుచున్న ఇటాలియను సప్లై నౌకల జట్టును, డచ్చి జలాంతర్గామి యొకటి యెదిర్చి ఒక సప్లై నౌకను ముంచివేసెను. మరియొక శత్రునౌకల జట్టును బ్రిటిషు విమానము లెదిర్చి, బాంబులు వర్షించి మూడు నౌకలను ముంచి వేసెను. వానిలో ఒకటి 8,000 టన్నులు ఇంకొకటి 6,000 టన్నులు పరిమాణము వుండును.

9 వ తేదీన ఫ్రెంచితీరపు సమీపముగా ప్రయాణ మొనర్చుచున్న జర్మను సప్లై నౌకలను బ్రిటిషు విమానము లెదిర్చెను. ఒక శత్రు సప్లై నౌక తగులబడిపోయెను. 9 శత్రు విమానములు కూల్చబడెను. 10 బ్రిటిషు విమానములు తిరిగిరాలేదు. 10 వ తేదీన "డిఫెండరు" అను బ్రిటిషు డిస్ట్రాయరు శత్రు చర్యలచే మునిగిపోయెను.

రష్యాపై దండయాత్ర ప్రారంభింపబడినప్పటినుండి ఇంతవరకు 14 జర్మను జలాంతర్గాముల ముంచివేసితిమని రష్యనులు ప్రకటించుచున్నారు. జర్మనీకిగల జలాంతర్గాముల బలములో ఇది పదియవవంతు.

తటస్థరాష్ట్రములు.

పోర్చుగలు దేశపు సొమ్ములను, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము వారిదివరకు జప్తుచేసి యుంచిరి. పోర్చుగలు ప్రభుత్వము తాము ఆక్సిసు రాజ్యములకు సహాయ మొనర్చుటకు వానిని వినియోగింపమని వాగ్దాన మొనర్చుటచే సదరు జప్తు రద్దుచేయబడెనని సంయుక్త రాష్ట్ర అధికారులు 12 వ తేదీన ప్రకటించిరి.

టర్కీ - ఈరాక్ - ఈరాన్.

టర్కీ ప్రభుత్వము తమ తూర్పు సరిహద్దులయందు సైనిక సన్నాహము గావించుకొని ముందుగ జాగ్రత్తపడుచున్నది. 19, 20 వ సంవత్సరముల యువకులనందరను నిర్బంధముగ సైన్యమున చేర్చుటకు ప్రభుత్వమున కధికార మొసగు చట్టమును, టర్కీ శాసనసభవారు 11 వ తేదీన నామోదించిరి.

టర్కీపై తమకు ఆక్రమణోద్దేశములు లేవనియు, ఇతరులెవరైన టర్కీపై నెత్తి వచ్చినయెడల తాము టర్కీకి సహాయము నత్తుమనియు, బ్రిటిషు-రష్యా ప్రభుత్వములు కలసి టర్కీ ప్రభుత్వమునకు 10 వ తేదీన వాగ్దానములనందజేసెను.

బ్రిటిషు-అమెరికను వత్తిడులకు లొంగి పర్షియా ప్రభుత్వము, ఆదేశమునుండి జర్మనులను వెడలగొట్టినయెడల, ఉభయ దేశములకుగల రాజకీయ సంబంధముల త్రెంచివేసికొనెదమని జర్మను అధికారులు హెచ్చరించిరి. ఏమి సంభవించినను సరే జర్మనులను వెళ్లగొట్టి తీరవలెనని, బ్రిటిషు రాయబారి పర్షియా ప్రభుత్వమునకు స్పష్టముగ దెలిపెను. 10 వ తేదీన మరికొందరు జర్మనులు ఈరాన్‌లో ప్రవేశించిరి.

ఈరాన్‌లో జర్మనుల చేరనిచ్చుటను ఆక్షేపించుచు సోవియటు రష్యా అధికారులు ఈరాన్ ప్రభుత్వమునకు అసమ్మతి పత్రము నంపజేసిరి. ఈ వ్యవహారముల చక్కబరుపనియెడల, పర్షియాలో ముఖ్యప్రదేశముల నాక్రమించుటకు రష్యాకు 1921 వ సం॥ ఒడంబడిక ప్రకారము అధికారముగలదని హెచ్చరించిరి.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.
[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.